# నిత్య జీవితంలో నిషిద్ధ కర్మలు

 కర్మాచరణలో వర్ణాశ్రమ ధర్మముల ప్రకారము ఎవరికి ఎట్టి కర్మలు విధివిహితములో అవియే సత్కర్మలు. అటుల కానివి నిషిద్ధకర్మలు. అటువంటి నిషిద్ధకర్మలు ఏంటో తెలుసుకోవడం అవసరం. నిత్య జీవితంలో ఎదురయ్యే నిషిద్ధ కర్మల గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

తూర్పు దిక్కున సకలదేవతలు ఉంటా.రు. దక్షిణమున పితృదేవతలు ఉంటారు పశ్చిమమున సమస్త ఋషులు ఉందురు. కనుక ఎప్పుడైనా సరే ఉత్తరం వైపునకే తుమ్మటం, ఉమ్మి వేయాలి. ఇక సుర్యాభిముఖంగా మూత్రవిసర్జన, మలవిసర్జన, ఉమ్మటం, పళ్ళు తోవటం చేయరాదు. ఇవి పంచ మహాపాతకాలలోకి వస్తాయి.

స్నానం నగ్నంగా చేయరాదు. ఒక వస్త్రం చుట్టుకుని చేయాలి. దిగంబరంగ స్నానం చేస్తే అది వరుణిడి(జలాది దేవత) పట్ల అపచారం, శరీరం పిశాచగ్రస్తం అవుతుంది. ఈ పాపకర్మకి(దిగంబరంగ స్నానం చేస్తే) ప్రాయశ్చిత్తం

ఏంటంటే.. ప్రతి రోజు సువర్ణం(బంగారం) దానం చేయాలి అలా 12 ఏళ్లు చేయాలి.

సూర్య చంద్ర గ్రహణకాలంలో భోజనంచేసేవారు నిశ్చయతాంబూలాలిచ్చక ఇతరులకు కన్యాదానం చేసేవారు. పార్థివలింగాన్ని భక్తితో అర్చించనివాడు, విప్రుని భయపెట్టి ధనం అపహరించేవాడు. దేవతర్చనాది సత్కర్మలకు అడ్డుతగిలినవాడు. న్యాయాధీశుని లేదా నగరరక్షకుని దిక్కరించినవాడు. తులసీదళం చేబూనికూడా మాటతప్పినవాడు, దైవప్రతిమ ఎదుటప్రమాణంచేసి తప్పినవాడు.. నరకానికి వెళ్తారని శాస్త్రాలు చెబుతున్నాయి.

మిత్రులను మోసంచేసినా, చేసిన మేలు మరచినా, తప్పుడు సాక్ష్యాలు సమర్పించినా, దేవబ్రాహ్మణ పరిహాసకులు, దైవజ్ఞుడు, వైద్యుడు అయినవారు తమకు విహితమైన ధర్మాలను ఆచరించక లోహ-రసాది విక్రయాలు చేపట్టి ప్రజలను వంచిస్తే నరకప్రాప్తి.

బ్రాహ్మణ, దేవతార్చన, శంఖధ్వని, తులసి, శివారాధన లేని చోట, విష్ణు భక్తులని నిందించిన చోట, సంధ్యావందన

విహీనుడు ఉన్నచోట, ఆచార వర్జితుడి ఇంట,
వాచాలుడైన వాడి ఇంట, తడికాళ్ళతో, నగ్నంగా
నిదురించేవాడి ఇంట, తోడపై దరువువేసే వాడిఇంట,
బ్రాహ్మణ ద్వేషి, జీవ హింస చేసేవాడి ఇంట,
దయాశున్యుడి ఇంట, విప్రులని నిందించే వాడి ఇంట,
లక్ష్మిదేవీ క్షణకాలం కూడా నిలువదని శాస్త్రాలు
చెబుతున్నాయి.

రుద్రాక్షధరించి లేదా ఏదైనా పవిత్ర వస్తువుని స్పృశించి
అసత్యం చెప్పరాదు. శుభ కార్యాలకి బయలుదేరేటప్పుడు
భర్త ముందు భార్య వెనుక నడవాలి. అశుభకార్యాలకి
బయలుదేరేటప్పుడు భార్య ముందు భర్త వెనుక నడవాలి.

నుదురు మీద బొట్టు, ఎడం భుజం మీద వస్త్రం లేకుండా
ఇతరులకు బట్టలు పెట్టకూడదు. ఎవరికైతే వస్త్రం ఉండదో
వారికీ ఆయుక్షీణం. నురుగు ఉన్న నీరు పూజకి
పనికిరాదు, అలానే వెంట్రుక ఉన్న నీరు కూడా. పరస్త్రీలను
కామించేవారు, పరద్రవ్యాలని ఆశించేవారు, పరులకు కీడు
తలపెట్టాలి అనుకునేవారు మానసిక పాపులు.

పాడ్యమి, షష్టి, అష్టమి, ఏకాదశి, చతుర్దశి, పౌర్ణమి, అమావాస్య, రవి సంక్రమణలయందు, వ్రత, శ్రాద్ధ దినముల యందు శరీరమునకు తైలమును పట్టించుకూడదని విష్ణు పురాణం చెబుతోంది.

భోజనం చేసేటపుడు నిషిద్ధ కర్మలు

ఉత్తరాభిముఖంగా కూర్చుని భోజనం చేయరాదు. శ్రాద్ధకర్మ చేసే రోజు మాత్రమే ఉత్తరాభిముఖంగా కూర్చుని భోజనం చేయాలి. బొట్టు లేకుండా భోజనం చేయరాదు. భోజనంలోవెంట్రుక వస్తే ఆ భోజనం త్యజించవలెను. కనీసం నేతితో(ఆవు నెయ్యి శ్రేష్టం) అభికరించిన(శుద్ధి) తరువాత తినాలి.

నిదురించేటపుడు.. ఉత్తరం వైపు తలవుంచి నిద్రపోకూడదు. తడికాళ్ళతోకానీ, నగ్నంగా కానీ నిద్రపోకూడదు.

దేవాలయ దర్శనంలో నిషిద్ధకర్మలు

దేవాలయ ముఖ ద్వారం పాదరక్షలు వేసుకుని దాట కూడదు. దేవాలయం గడపని తొక్కరాదు. ఈ రెండు

చేసిన వారికి రాబోవు జన్మలో వికలాంగులుగా జీవించే అవకాశం ఉంది. ఈశ్వరుడికి కాళ్ళు పెట్టరాదు, గుడిలో సాష్టాంగనమస్కారం చేసేటపుడు అన్ని వైపులా గమనించుకుని ఈశ్వరుడి వైపు కాళ్ళు రాకుండా చూసుకుని సాష్టాంగనమస్కారం చేయవలెను. ఒకవేళ అలా కుదరకపోతే నుంచుని నమస్కారం చేస్తే సరి పోతుంది.

పెళ్లి విషయంలో నిషిద్ధకర్మలు

ఇంటిలో ఆరోగ్యంగా ఉన్న పెద్ద కుమారుడుకి పెళ్లి చేయకుండా చిన్నవాళ్ళకి చేయరాదు, అలాచేస్తే పెళ్లికొడుకు, అతని తల్లిదండ్రులు, పెళ్లి జరిపించిన పురోహితుడు అందరూ నరకానికి వెళతారు. ఇది ఆడపిల్లలకి కూడా వర్తిస్తుంది. పెళ్లికాని అన్నగారిని పరివిత్తి అంటారు. పరివిత్తితో కూడిన యజ్ఞాదులు కూడా పాపాలే అవుతాయి. పరివిత్తికి కన్యాదానంచేయడం అపాత్రదానం అవుతుంది.

నిత్య జీవితంలో ఆచరించకూడని మరిన్ని నిశిద్ధ కర్మల గురించి మరో పోస్టులో తెలుసుకుందాం.

[12/02 7:05 am] Astrology Predictions: మానవ నిత్య జీవితంలో ఆచరించాల్సిన, ఆచరించని కర్మల గురించి తెలుసుకోవడం మంచిది. గత పోస్టులో తెలుసుకున్నట్టే నిషిద్ధ కర్మల గురించి మరికొంత వివరములు ఇప్పుడు తెలుసుకుందాము.

వారము - క్షౌరకర్మ ఫలితాలు (వారాహీసంహిత - గర్గాది మహర్షులు)

వారము ఫలితము

ఆదివారము ఒక మాసము ఆయువు తగ్గిపోతుంది

సోమవారముము ఏడు మాసములు ఆయువు వృద్ధి చెందును. పుత్రులు కోరుకునే గృహస్థులు, ఒకే ఒక పుత్రుడు గలవారు సోమవారంనాడు క

్షౌరము చేయించుకోనగూడదు.

మంగళవారముము ఏనిమిది మాసములు ఆయువు తగ్గిపోతుంది

బుధవారముము ఐదు మాసములు ఆయువు వృద్ధి చెందును

గురువారముము పది మాసములు ఆయువు వృద్ధి చెందును. లక్ష్మిని కోరుకునేవారు గురువారమునాడు క్షౌరము చేయించుకోనగూడదు

శుక్రవారముము పదకొండు మాసములు ఆయువు వృద్ధి చెందును

శనివారముము ఏడు మాసములు ఆయువు తగ్గిపోతుంది

పూజా ప్రక్రియలో నిషిద్ధకర్మలు

గృహంలో దేవతా విగ్రహాలు బొటనవేలు కన్నా పెద్దగా ఉండరాదు. మంత్ర పుష్పం, సుప్రభాతం కుర్చుని చదవరాదు. ఈశ్వరుడుకి పవళింపు సేవ నిలబడి చేయరాదు. బొట్టు, విభూతి లేదా కనీసం బొట్టు అయిన లేకుండా పూజ చేయకూడదు. ఈశ్వరుడికి, గురువుకి ఒక చేతితో నమస్కారం చేయరాదు అలా చేస్తే పైజన్మలో చేతులు లేకుండా జన్మించటం కానీ, మధ్యలో చేతులు పోవటం కానీ జరుగుతాయి.

ఈశ్వరుడికి వీపు చూపరాదు. ఈశ్వరుడి ఎదురుగా నిలబడి ఆత్మప్రదక్షిణ చేయరాదు. ఈశ్వరుడికి చేసే

దీపారాధన పరదేవతతో సమానం. ఆ దీపారాధనతో పుల్లలు కానీ, సాంబ్రాణికడ్డికానీ, హారతికర్పూరంకానీ మరి ఏదైనా కానీ వెలిగించకూడదు. పూజ సమయమున ఈశ్వరుడు మన కంటే ఎత్తులోవుండాలి, అలానే పూజా వస్తువులు కుడి వైపు నుంచి తీసుకోవాలి. వెడం చేయి పూజా విధులలో నిషేధం. ఇక ఆచమనం చేసేటప్పుడు శబ్దం రాకూడదు.

ఈశ్వర నిర్మాల్యం కాలితో తొక్కరాదు. అలాచేస్తే ఈ జన్మలో చేసుకున్న పుణ్యంతో పాటు పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యం కూడా నశించును. రుద్రాక్షలు ధరించేవారు మద్యం, మాంసము, ఉల్లి, వెల్లుల్లి, మునగ, శ్లేషాత్మక పదార్థాలు తినకూడదు.

స్త్రీలకి నిషిద్ధకర్మలు

స్త్రీలు తులసీదళాలు తుంచ రాదు. పురుషులు మాత్రమే తుంచ వలెను. పౌర్ణమి, అమావాస్యనాడు, రవి సంక్రమణ, తైలాభ్యంగనస్నానం చేసిననాడు. త్రిసంధ్యలకాలంలో, మైలరోజులలో, రాత్రి ధరించి ఉన్న దుస్తులతోను, స్నానం చేసి శుభ్రమైన వస్త్రం ధరించకుండా, తులసిని తుంచడం మహాపాపం. అలా

చేయడం అంటే సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు శిరస్సునే తుంచినట్లే.

స్త్రీలు జుట్టు విరబోసుకుని ఇంట్లో తిరగరాదు. ఇలా స్త్రీలు చేస్తే ఇంటికి, ఇంట్లో ఉన్నవారికి అశుభం. అలాంటి ఇంట్లో లక్ష్మీదేవి ఉండదు. స్త్రీలు జుట్టు విరబోసుకుని భర్తకి కనపడరాదు. అలాకనపడితే భర్తకి గండం. బయటకి వెళుతున్నపుడు స్త్రీ జుట్టు విరబోసుకుని కనపడితే వెనక్కి ఇంట్లోకి వచ్చి కాళ్ళు కడుక్కుని కొంచం సేపు కుర్చుని వెళ్ళాలి. స్త్రీలు తాటంకాలు (చెవి దిద్దులు) లేకుండా భర్తకి కనపడరాదు. అలాకనపడితే భర్తకి గండం.

పురుషులకి నిషిద్ధకర్మలు

ధర్మపత్ని జీవించి ఉండగా పురుషుడు పరస్త్రీ సంగమం చేయరాదు అలాచేస్తే, సంవత్సరం పాటు వెళ్ళిన ఇంటికి వెళ్ళకుండా వెళ్లి తను చేసిన తప్పు చెప్పి ఆ ఇంట్లో వాళ్ళు వేసిన భిక్షమాత్రమేస్వీకరిస్తూ జీవించాలి. పూర్తిగా శిరోముండనం చేసుకోకూడదు కనీసం శిఖ ఉంచుకోవాలి. అలా చేసుకుంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. పూర్తిగా శిరోముండనం చేసుకుంటే వైదిక క్రియలకి పనికిరాదు. ఏకాదశి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమా, సంక్రాంతి,

వ్యతిపాతము, విష్టి, ఇత్యాదులయందు, వ్రత దినములయందు, శ్రాద్ధ దినముల యందు, మంగళ, శనివారముల యందు క్షౌరకర్మ పనికిరాదు.